# అథ దశయో%ధ్యాయః

# త్రిపుర దహనము

సనత్కుమార ఉవాచ |

అథ శంభుర్మహాదేవో రథస్థ స్సర్వసంయుతః | త్రిపురం సకలం దగ్ధుముద్యతో%భూత్సురద్విషామ్ || 1

శీర్షం స్థనకమాస్థాయ సంధాయ చ శరోత్తమమ్ | సజ్జం తత్కార్ముకం దృత్వా ప్రత్యాలీఢం మహాద్భుతమ్ || 2

నివేశ్య దృఢముష్ఠౌ చ దృష్టం దృష్టౌ నివేశ్చ చ | అతిష్ఠన్నిశ్చలస్తత్ర శతం వర్ష సహస్రకమ్ || 3

తతో%ంగుష్ఠే గణాధ్యక్షస్స తుదైత్యనిశంస్థితః | న లక్ష్యం వివిశుస్తాని పురాణ్యస్య త్రిశూలినః || 4

తతో%ంతరిక్షాదశృణోద్ధనుర్బాణధరో హరః | ముంజకేశో విరూపాక్షో వాచం పరమ శోభనామ్ || 5

భో భో న మావద్భగవన్నర్చితో%సౌ వినాయకః | పురాణి జగదీశేశ సాంప్రతం న హనిష్యతి || 6

ఏతచ్ఛ్రుత్వా తు వచనం గజవక్త్ర మపూజయత్ | భద్రకాలీం సమాహూయ తతో%ంక నిషూదనః || 7

సనత్కుమారుడిట్లు పలికెను-

అపుడు సర్వసామగ్రితో కూడి రథమునందున్న మహాదేవుడగు శంభుడు ఆ రాక్షసుల త్రిపురములను సంపూర్ణముగా దహించి వేయుటకు సన్నద్ధుడై యుండెను (1). ఆయన రథము యొక్క అగ్రాసనమునందు ఒక కాలు ముందుకు మరియొక కాలు వెకకు వేసి యుండే అద్భుతమగు రథిక విన్యాసము గలవడై ఆ ధనస్సున్కు నారిత్రాటిని తగిల్చి గొప్ప బాణమును దానిపై సంధించెను (2). ధనస్సను పిడికిలి యందు గట్టిగా పట్టి చూపును

చూపుతో కలిపి నిశ్చలముగా అచట ఆయన లక్ష సంవత్సరములు నిలబడెను (3). అపుడు గణపతి ఆయన బొటనవ్రేలి యందున్నవాడై నిరంతరమగు పీడను కలిగించగా, త్రిశూలధారియగు శివుని ఆ బాణములు త్రిపురములు అనే లక్ష్యమును చేరలేకపోయినవి (4). ధనుర్బాణములను ధరించి యున్నవాడు, జటాజూటధారి, ముక్కంటి యగు హరుడు ఆకాశము నుండి పరమ మంగళకరమగు వచనమును వినెను (5). హే భగవాన్! జగదీశ్వరా! ఈశా! నీవు వినాయకుని పూజించనంత వరకు త్రిపురనాశము సంభవము కాదు (6). అంధకాసురుని సంహరించని శివుడు ఈ మాటను విని భద్రకాళిని పిలిచి గజాననుని పూజించెను (7).

తస్మిన్ సంపూజితే హర్షాత్పరితుష్టే పురస్సరే | వినాయవే తతో వ్యోమ్ని దదర్శ భగవాన్ హర ః || 8

పురాణి త్రీణి దైద్యానాం తారకాణాం మహాత్మనామ్ | యథాతథం హి యుక్తాని కేచిదిత్థం వదంతి హి || 9

పరబ్రహ్మణి దేవేశే సర్వోపాస్యే మహేశ్వరే | అన్నప్రసాదతః కార్యసిద్ధిర్ఘటతి నేతి హి || 10

స స్వతంత్రః పరం బ్రహ్మ సుగుణో నిర్గుణో%పి హ | అలక్ష్య స్సకలైస్స్వామీ పరమాత్మా నిరంజనః || 11

పంచదేవాత్మకః పంచదేవోపాస్యః పరః పప్రభుః | తస్యోపాస్యో న కోప్యస్తి స ఏవోపాస్య ఆలయమ్ || 12

అథవా లీలయా తస్య సర్వం సంఘటతే మునే | చరితం దేవదేవస్య వరదాత్ఉర్మహేశితుః || 13

తస్మింస్థితే మహాదేవే పూజయిత్వా గణాధిపమ్ | పురాణి తత్ర కాలేన జగ్మురేకత్వమాశు వై || 14

సర్వకార్యములకు ముందు ఉండే వినాయకుడు ఈ తీరున పూజింపబడి సంతసించెను అపుడు హరభగవానుడు ఆకాశమునందు (8). మహాత్ములగు తారకాక్షుడు మొదలగు రాక్షసుల త్రిపురములను గాంచెను. ఆ నగరములు ఎప్పటివలెనే యోగ్యముగా నుండెను. కొందరు ఇట్లు చెప్పుచున్నారు (9). పరబ్రహ్మ, దేవదేవుడు, సర్వులచు ఉపాసింపబడు వాడు అగు మహేశ్వరుని యందు ఇతర దేవతానుగ్రహముచే కార్యము సిద్ధించుట అనునది ఘటిల్లదు గదా! (10). ఆ పరబ్రహ్మ స్వతంత్రుడు. సగుణుడు, నిర్గుణడు కూడ ఆయనయే. పరమాత్మ, కర్మలేపము లేనివాడు అగు ఆ స్వామి అందరికీ కానరాడు (11). ఆ పరమ ప్రభుడు పంచదేవ (బ్రహ్మ, విష్ణు,రుద్ర, ఈశాన, సదాశివ) స్వరూపుడు, పంచదేవతలచే ఉపాసింపబడువాడు.ఆయనచే ఉపాసింపబడే మరియొకరు ఎవ్వరూ లేరు. ప్రలయము వరకు అందరిచే ఉపాసింపబడువాడు ఆయనయే (12). అయిననూ, ఓ మునీ! దేవ దేవుడు, వరముల నిచ్చువాడు అగు మహేశ్వరుని లీలచే సర్వవృత్తాంతములు ఘటిల్లుచుండును (13). ఆ మహాదేవుడు గణాధిపతిని పూజించి అచల నిలబడి యుండగా, కొద్దిసేపటిలో ఆ మూడు పురములు ఒక్కటిగా అయినవి (14).

ఏకీ భావం మునే తత్ర త్రిపురే సముపాగతే | బభూవ తుములో హర్షో దేవాదీనాం మహాత్మనామ్ || 15

తతో దేవగణాస్సర్వే సిద్ధాశ్చ పరమర్షయః | జయేతి వాచో ముముచు స్తుస్తవంతశ్చాష్టయూర్తినమ్ || 16

అథాహేతి తదా బ్రహ్మ విష్ణుశ్చ జగతాం పతిః | సమయో%పి సమాయాతో దైత్యానాం వధకర్మణః || 17

తేషాం తారకపుత్రాణాం త్రిపురాణాం మహేశ్వర | దేవ కార్యం కురు విభో ఏకత్వమపి చాగతమ్ || 18

యావన్న యాన్తి దేవేశ వప్రయోగం పురాణి వై | తావద్బాణం వియుంచస్వ త్రిపురం భస్మ సాత్కురు || 19

అథ సజ్యం ధనుః కృత్వా శర్వస్సంధాయం తం శరమ్ | పూజ్యం పాశుపతాస్త్రం స త్రిపురం సమచింతయత్ || 20

లథ దేవో మహాదేవో వరలీలావిశారదః | కేనాపి కారణ   నాత్ర సావజ్ఞం తదవైక్షత || 21

ఓ మహర్షీ! మూడు పురములు ఒక్క రేఖలోనికి రాగానే, మహాత్ములగు దేవతలు బిగ్గరగా హర్షధ్వానములను చేసిరి (15). అపుడు దేవగణములు, సిద్ధులు, మహర్షులు అందరు అష్టమూర్తియగు శివుని స్తుతించి జయ జయధ్వానములను చేసిరి (16). అపుడు బ్రహ్మ, మరియు జగత్ప్రభువడు విష్ణువు ఇట్లు పలికిరి : రాక్షసులను సంహరించే సమయము ఆసన్నమైనది (17). ఓ మహేశ్వరా! త్రిపురములు ఒక్కరేఖ లోనికి వచ్చినవి. హే విభో! తారకపుత్రులగు ఆ రాక్షసులను సంహరించి దేవకార్యమును చేయుము (18). ఓ దేవదేవా! ఆ పురములు మరల విడిపోకమునుపే బాణమును ప్రయోగించి త్రిపురమును భస్మము చేయుము (19). అపుడా శివుడు ధనస్సునకు నారిత్రాటిని తగిల్చి బాణములను సంధానము చుసి పూజ్యమగు పాశుపతాస్త్రమును మనస్సులో ధ్యానము చుసెను (20). అపుడు మహాదేవుడు,గొప్ప లీలలను నెరపుటలోనిపుణుడునగు ఆ శివుడు ఏదో ఒక కారణముచే దానిని నిరాదరణ భావముతో పరికించెను (21).

పురత్రయం విరూపాక్షః కర్తు తద్భస్మసాత్ క్షణాత్ | సమర్ధః పరమేశనో మీనాతు చ సతా గతిః || 22

తగ్ధం సమర్ధో దేవశ వీక్షణ   న జగత్త్రయమ్ |- అస్మద్యశో వివృద్ధర్థం శరం మోక్తు మిహర్హసి || 23

ఇతి స్తుతో%మరైస్సర్వై ర్విష్ణ్వాది విధబిస్తదా | దగ్ధం పురత్రయం తద్వై బాణ   నైచ్ఛన్మహేశ్వరః || 24

అభిలాఖయముహూర్తే తు వికృష్య ధనురద్భుతమ్ | కృత్వా జ్యాతలనిర్ఘోషం నాదమత్యంతదుస్సహమ్ || 25

ఆత్మనో నామ విశ్రావ్య సమాభాస్య మహాసురాన్ | మార్తండకోటి వపుషం కాండముగ్రో ముమోచ హ || 26

దదాహ త్రిపురస్థాంస్తాన్ దైత్యాంస్త్రీన్ విమలాపహః | స ఆశుగో విష్ణుమయో వహ్నిశల్యో మహాజ్వలన్ || 27

తతః పురాణి దగ్ధాని చతుర్జలధి మేఖలామ్ | గతాని యుగపద్భూమిం త్రీణి దగ్ధాని భస్మశః || 28

పరమేశ్వరుడు, సత్పురుషులకు శరణ్యుడు అగు ఆ ముక్కంటి దైవము ఆ మూడు పురములను ఓణములో భస్మము చుయుటకు సమర్ఛుడు. ఓ ఈశ్వరా! నీవు ఆ పురములకు బాణములను గురిపెట్టుము (22). ఓ దేవేవా! నీవు నీ కంటి చూపుచు ముల్లోకములను భస్మము చేయ సమర్థుడవు. కాన మా కీర్తిని ఇనుమడింప చుయుట కొరకై ఆ బాణమును ప్రయోగించుము (23). విష్ణువు, బ్రహ్మ మొదలగు దేవతలందరు ఇట్లు స్తుంతించగా, మహేశ్వరుడు ఆ త్రిపురములను బాణముచే దహించుటకు నిశ్చయించెను (24). అభిజిల్లగ్నము నందు శంకరుడు అద్భుతమగు ఆ ధనస్సను ఎక్కుపెట్టి, మిక్కిలి సహింపశక్యము కాని సింహనాదమును చేయుచూ నారిత్రాటిని మీటజొచ్చెను (25). తనపేరును అందరికీ వినపించి, ఆ గొప్ప రాక్షసులను బిగ్గరగా ఆహ్వానించి, భయంకరాకారుడగు శివుడు కొటిసూర్యుల కాంతితో ప్రకాశించే ఆ బాణమును విడిచిపెట్టెను (26). సమస్త దోషములను తొలగించునది, విష్ణుస్వరూపమైనది, వేగముగా పయనించునది, భయంకరముగా మండుచున్నది అగు ఆ అగ్నిబాణము త్రిపురమునందున్న ఆ ముగ్గురు రాక్షసులను కాల్చివేసెను (27). అపుడా మూడు పురములు దగ్ధమై బూడిద రూపములో ఒక్కసారి, నాల్గుసముద్రములు మేకలగా గల పృథివిపై పడినవి (28).

దైత్యాస్తు శతవో దగ్ధస్తస్య బాణస్థవహ్నినా | హాహాకారం ప్రకుర్వంతశ్శివపూజా వ్యతిక్రమాత్ || 29

తారకాక్షస్తు నిర్దగ్ధో భ్రాతృభ్యాం సహితో%భవత్ | సస్మార స్వప్రభుం దేవం శంకరం భక్తవత్సలమ్ || 30

భక్త్యా పరమయా యుక్తః ప్రలపన్ వివిధా గిరః | మహాదేవం సముద్వీక్ష్య మనసా తమువాచ సః || 31

శివపూజను నిరాకరించిన కారణముచు వందలాది రాక్షసులు హాహాకారములను చేయుచూ ఆ బాణాగ్నిచే దహింపబడిరి (29). తారకాక్షుడు సోదరులతో గూడి దహింపబు చున్నవాడై తనకు ప్రభువు, భక్తవత్సలుడు నగు శంకర దేవుని స్మరించెను (30). అతడు పరమ భక్తి గలవడై అనేక వచనములను పలుకుచూ, మనస్సులో మహాదేవుని దర్శించి, ఆయనతో నిట్లనెను (31).

తారకాక్ష ఉవాచ |

భవ జ్ఞాతో%సి తుష్టో%సి యద్యస్మాన్ సహ బంధుభిః | తేవ సత్యేన భూయో%పి కదా త్వం ప్రదహిష్యసి || 32

దుర్లభం లబ్ధ మస్మాభిర్యదప్రాప్యం సురాసురైః | త్వద్భావభావితా బుద్ధి ర్జాతే జాతే భవిత్వితి || 33

విత్యేవం విబ్రువంతస్తే దానవాస్తేన వహ్నినా | శివాజ్ఞయాద్భుతం దగ్ధా భస్మసాదభవన్మునే || 34

అన్యే%పి బాలా వృద్ధాశ్చ దానవాస్ఏన వహ్నినా | శివాజ్ఞయా ద్రుతం వ్యాస నిర్దగ్ధా భస్మసాత్కృతాః || 35

స్త్రియో వా పురషా వాపి వాహనాని చ తత్ర యే | సర్వే తేనాగ్నినా దగ్ధాః కల్పాంతే తు జగద్యథా || 36

భర్తృాన్ కంఠ గాతాన్ హిత్వా కాశ్చిద్దగ్ధా వరస్త్రియంః | కాశ్చిత్సుప్తాః ప్రమాత్తాశ్చ రతిశ్రాంతాశ్చ యోషితః || 37

అర్ధదగ్ధా విబుద్ధాశ్చ బభ్రముర్మోహమూర్చితాః | తేన నాసీత్సుసూక్ష్మో%పి ఘోరత్రిపురవహ్నినా || 38

అవిదగ్ధో వినిర్ముక్త స్థ్సావరో జంగమోఽపి వా | వర్జయిత్వా మయం దైత్యం విశ్వరాఽ్మాణ మవ్యయమ్ || 39

తారకాక్షుడిట్లు పలికెను-

హే భవా| నేను నిన్ను తెఉసుకుంటిని. మమ్ములను బంధులతో సహా దహించుటలో నీకు ఆనందమున్నచో, నీవు మమ్ములను మరల వాస్తవముగా ఎప్పుడు దహించెదవు? (32). దేవతలకు గాని, రాక్షసులకుగాని లభింపశక్యము గాని భాగ్యము మాకు లభించినది. మా మనస్సులు జన్మజన్మలో నీ చింతనతో నిండి యుండు గాక! (33). ఓ మునీ! ఆ రాక్షసులు ఇట్లు పలుకుతూ శివుని యాజ్ఞచే ఆ అగ్నిచే దహింపబడి బూదిదయైనారు. ఆ దృశ్యము అద్భుతముగ నుండెను (34). ఓ వ్యాసా! బాలురు. వృద్ధులు అగు ఇతర రాక్షసులు కాడా శివాజ్ఞచే శాఘ్రముగా ఆ అగ్నిచే దహింపబడి బూడిదయైనారు (35). కల్పాంతమునందు జగత్తు భస్మ మగు తీరున, ఆ త్రిపురములోని స్త్రీలు, పురుషులు, అచట నున్న వాహనములు ఇత్యాది సర్వము ఆ అగ్నిచే భస్మము చుయబడెను (36). కొందరు సుందర యువతులు భర్తను కంఠమునందు కౌగిలించి యుండగానే దహింపబడిరి. ఆటపాటలలో అలసి సొలసి, మరియు మత్తెక్కి నిద్రించియున్న స్త్రీలు అటులనే దగ్ధమైరి (37). కొందరు సగము కాలి తెలివి తెచ్చుకొని మోమముతో ఇటునటు పరువలెత్తి మూర్ఛిల్లిరి. ఘోరమగు ఆ అగ్నిచే దహింపబడని సూక్ష్మమగు వస్తువు అయిననూ ఆ త్రిపురములో లేకుండెను (38). కదలాడని జడములు గాని, కదలాడే ప్రాణులు గాని దహింపబడకుండగా విడువబడినవి అచట లేకుండెను. రాక్షసుల విశ్వకర్మయగు మయాసురునకు వినాశము లేదు. ఆయన తక్కసర్వము నశించెను (39).

అవిరుద్ధం తు దేవనాం రక్షితం శంభుతేజసా | విపత్కాలేఽపి సద్భక్తం మహేశశరణాగతమ్ || 40

సన్నిపాతో హి యేషాం నో విద్యతే నాశకారకః | దైత్యానామన్నసత్త్వానాం బావాభావే కృతాకృతే || 41

తస్మా ద్యత్నస్సుసంభావ్యస్సద్భిః కర్తవ్య ఏవ హి | గర్హణాత్ క్షీయతే లోకో న తత్కర్మ సమాచరేత్ || 42

న సంయోగో యథా తేషాం బూయాత్త్రి పురవాసినామ్ | మతవేతద్ధి సర్వేషాం దైవాద్యది యతో భ##వేత్ || 43

యే పూజయంతస్తత్రాపి దైత్యా రుద్రం సబాధవాః | గాణసత్యం యయుస్సర్వే శివజూజా విధేర్భలాత్ || 44

ఇతి శ్రీ శివమహాపురాణ  రుద్ర సంహితాయాం యుద్ధ ఖండే త్రిపుర దాహవర్ణనం నామ దశమో%ధ్యాయః (10).

యముడు దేవతలకు విరోధి కాదు. ఆపత్కాలమునందైననూ మహాభక్తుడు, మహేశుని శరణు పొందిన వాడు అగు యముడు శంభుని తేజస్సుచే రక్షింపబడెను (40). రాక్షసులు గాని, ఇతర ప్రాణులు గాని చేయు కర్మలు, పరిత్యజించు కర్మలు, మరియు వారి రాగద్వేషములు పతనహేతువులు కానిచో, వారికి వినాశము కలుగదు (41). కావున సత్పురుషులు మిక్కిలి యోగ్యమగు కర్మను ఆచరించుటకై యత్నించవలెను. పాపకర్మచు ఇహపరములు నశించును. కావున అట్టి నిందనీయమగు కర్మను చేయరాదు (42). త్రిపురవాసులకు ఘటిల్లిన సంగము వంటి సంగము ఇతరులకు కలుగకుండు గాక ! అట్టి సంగము దైవవశమున సంప్రాప్తమైనచో, దానిని సర్వులు స్వీకరించవలసినదే గదా! (43). ఆ రాక్షసులు బంధులతో గూడి త్రిపురములో నున్నవారై శివుని పూజించిరి గదా! వారందరు ఆ శివపూజానుష్ఠనప్రభావముచే గాణపత్య స్థానమును పొందిర (44).

శ్రీ శివ మహా పురాణములోని రుద్ర సంహితయందు యుద్ధఖండలో త్రిపురదాహ వర్ణనమనే పదియవ ఆధ్యాయము ముగిసినది (10).